శ్లో॥ ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా ।
యదృచ్ఛయా వ_ర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః॥

టీక॥ యేన = యే, మహాత్మనా = మహాత్ముని చేత, ఇదం సర్వం = ఈ సంపూర్ణమైన, జగత్ = ప్రపంచము, ఆత్మైవ = ఆత్మయే, (ఇతి = అని) జ్ఞాతం = తెలుసుకొనబడుచున్నదో, తం = అటువంటి, యదృచ్ఛయా = ప్రారబ్ధవశమువలన స్వేచ్ఛగా, వర్తమానం = ఉంటున్న జ్ఞానిని, నిషేద్ధుం = నిషేధించుటకు, కః = ఎవడు, క్షమేత = సమర్థుడగును?

తా॥ ప్రశ్న: జ్ఞానియయినను కర్మలుచేసినచో పుణ్యపాపముల సంబంధము తప్పక ఉండగలదు. అంతేగాని అతడు కర్మలను చేయును, కాని పుణ్యపాపముల సంబంధముండదు అను విషయమెట్లు పొసగును?

ఉ॥ ఈదృశ్యమానమైన సమస్తప్రపంచము తన ఆత్మయే యని తెలిసికొన్న జ్ఞాని ప్రారబ్ధవశమువలన కర్మలను చేయుచున్నను, చేయకున్నను అతనిని చేయుము అనిగాని, చేయకుము అనిగాని విధినిషేధములను చేయువారెవరు?

శారీరకభాష్యముకూడ యీ విషయమునందిట్లు చెప్పుచున్నది:

"అవిద్యావద్విషయో వేదః"

వేదవచనముగూడ అజ్ఞానులకే విధినిషేధములుగాని జ్ఞానులకు కాదని తెలుపుచున్నది. జ్ఞానులనుగూర్చి వేదము ఆజ్ఞాపించలేదు.

స్మృతియు నిట్లు చెప్పుచున్నది:

"అబోధనీయ ఏవాసౌ సుప్తో రాజేవ వందిభిః"

వందిజనులేలాగున నిద్రించుచున్న రాజును మేలుకొలుపుటకు ఆతని చరిత్రమును వర్ణనచేయుదురో, అట్లే వేదములుగూడ జ్ఞాని యొక్క చరిత్రను వర్ణించుచున్నవి. ఈ కారణమున పుణ్య పాపములు జ్ఞానిని తాకనుగూడ తాకవు.

అవ॥ ఇచ్ఛానిచ్ఛలను మరలించుటకు శక్యముగాదు గనుక జ్ఞాని సయితము యథేష్టముగా ప్రవర్తింపడా అను శంకకు సమాధానము.

శ్లో॥ ఆబ్రహ్మస్తంభపర్యంతే భూతగ్రామే చతుర్విధే ।
విజ్ఞస్యైవ హి సామర్థ్యమిచ్ఛానిచ్ఛావివర్జనే ॥ 5

టీక॥ ఆబ్రహ్మస్తంభపర్యంతే = చతుర్ముఖబ్రహ్మ మొదలుకొని తృణపర్యంతముగల, చతుర్విధే = నాలుగువిధములైన, (జరాయుజ - అండజ, స్వేదజ, ఉద్భిజ్జములను) భూతగ్రామే = భూతసమూహము నందు, విజ్ఞస్య ఏవ = జ్ఞానికొక్కనికే, ఇచ్ఛానిచ్ఛావివర్జనే = ఇచ్ఛానిచ్ఛలను త్యజించుటయందు, సామర్థ్యం = సామర్థ్యమున్నది. హి = నిశ్చయము.

తా॥ ప్రశ్న: జ్ఞానికి ప్రవృత్తి, యదృచ్ఛ అనగా దైవేచ్ఛచేతనా లేక తన ఇచ్ఛచేతనా కలుగుచున్నది?

ఉ॥ జ్ఞానికి ప్రవృత్తి దైవేచ్ఛచేతనే కలుగుచున్నది. తన యిచ్ఛచేతగాదు. విచారించినచో బ్రహ్మ మొదలు తృణపర్యంతముగల ప్రాణులకు ఇచ్ఛనుగాని, అనిచ్ఛనుగాని దూరమొన

రించుకొనుటకు సామర్థ్యములేదు. కాని బ్రహ్మజ్ఞానికి మాత్రము ఇచ్ఛానిచ్ఛలను తొలగించుకొనుటకు సామర్థ్యమున్నది. ఇందు వలన దైవేచ్ఛననుసరించి భోగములయందు ప్రవృత్తుడుగానీ, లేక కర్మములయందు ప్రవృత్తుడుగానీ విధినిషేధములకు కింకరుడు కాజాలడు.

శ్రీ శుకబ్రహ్మర్షి యిట్లు చెప్పుచున్నాడు :

భేదాభేదౌ సపది గళితౌ పుణ్యపాపే విశీర్ణే
మాయామోహౌ క్షయముపగతౌ నష్టసందేహవృత్తేః ।
శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధం
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః ॥

అనగా యే బ్రహ్మజ్ఞానికి ఆత్మజ్ఞానప్రభావమువలన భేదము, అభేదము యీ రెండువృత్తులు శీఘ్రముగా నశించి అతనికి పుణ్యపాపములు నష్టమగుచున్నవి. ఎవనికి మాయా - మాయా కార్యమగు మోహము యీ రెండును నశించిపోయినవో, ఎవడు శబ్దాదివిషయములనుండి, మూడుగుణములనుండి రహితుడో, ఎవడు ఆత్మతత్త్వమును పొందినవాడో, మరియు నెవడు త్రిగుణరహితుడై నిర్గుణబ్రహ్మమార్గమునందు చరించుచున్నాడో అట్టివానికొకవిధియులేదు, నిషేధములేదు.

ప్రశ్న॥ "అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్"
అనగా చేయబడిన శుభాశుభకర్మములన్నియు అవశ్యము అన్ని

ప్రాణులు అనుభవించవలసినదే అని అన్నచో నిక యీ వాక్యముల వలన ప్రయోజనమేమి?

ఉ॥ ఈ వాక్యములన్నియు అజ్ఞానులకొరకేగాని, జ్ఞానుల కొరకు గావు అని వేదము చెప్పుచున్నది.

"తస్య పుత్రా దాయముపయంతి, సుహృదః సాధుకృత్యం ద్విషంతః పాపకృత్యమ్"

అనగా శుభాశుభకర్మములను చేయుచున్న జ్ఞానియొక్క ధనమును అతని పుత్రులును, పుణ్యకర్మలను (పుణ్యమును) అతని మిత్రులును, పాపకర్మలను (పాపములను) అతని శత్రువులును తీసికొనుచున్నారు. జ్ఞాని పుణ్యపాపములచే రహితుడై ముక్తుడగుచున్నాడు.

"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే"

అనగా యెంతవరకు జ్ఞాని ప్రారబ్ధకర్మానుభవమునుండి విడివడడో కేవలమంతకాలమువరకు మాత్రమే అతనికి మోక్షమునందు విలంబమగుచున్నది.

"అథ సంపత్స్యే"

ఎప్పుడతడు ప్రారబ్ధకర్మమునుండి విడివడుచున్నాడో, అప్పుడు శరీరరూపోపాధినుండి రహితుడై బ్రహ్మముతో నభేదప్రాప్తిని పొందుచున్నాడు.

"తదా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య
ముపైతి"

అనగా శరీరమును విడిచిపెట్టినవెంటనే జ్ఞాని పుణ్యపాపములనుండి రహితుడై మరియు భావిజన్మకర్మములనుండి రహితుడై బ్రహ్మ మునందు లీనమగుచున్నాడు.

"న తస్య ప్రాణాః ఉత్క్రామంతి"

మరియు జ్ఞానియొక్క ప్రాణములు లోకాంతరగమనమును చేయవు.

"అత్రైవ సమవలీయంతే"

తనకు కారణమైన స్థానమునందే లీనుడగుచున్నాడు. ఇట్లే జ్ఞానికి కర్మఫలనిషిద్ధములగు శ్రుతివాక్యము లెన్నోయున్నవి. మరియు గీతయందుగూడ శ్రీకృష్ణభగవానుడు జ్ఞానరూపాగ్నివలన యితని సర్వకర్మములు దగ్ధమగుచున్నవి అని చెప్పెను.

ప్రశ్న॥ కారణనాశమైనందున కార్యనాశముగూడ కలుగుచున్నది. తంతువులు నశించుచో పటముగూడ నశించునట్లు ఆత్మజ్ఞానమువలన అజ్ఞాననాశముకాగా అజ్ఞానకార్యమగు జ్ఞాని శరీరముగూడ నశించవలయునుగదా?

ఉ॥ కారణమైన అజ్ఞాననాశముతోపాటే జ్ఞానియొక్క శరీరేంద్రియములుగూడ నాశమగుచున్నవి. అనగా జ్ఞానరూప మైన అగ్నిలో జ్ఞానియొక్క సమస్తదేహేంద్రియాదులు భస్మ

శ్లో॥ ఆత్మానమద్వయం కశ్చిజ్జానాతి జగదీశ్వరం।
యద్వేత్తి తత్స కురుతే న భయం తస్య కుత్రచిత్ ॥ 6

టీక॥ కశ్చిత్ = ఒకానొకడు, ఆత్మానం = ఆత్మను (జీవుని), చ = మరియు, జగదీశ్వరం = జగదీశ్వరుని, అద్వైతం = అద్వైతమునుగా (వేరుకాని వారినిగా), జానాతి = తెలిసికొనుచున్నాడు, సః = అట్టివాడు, యత్ = దేనిని, వేత్తి = తెలుసుకొనుచున్నాడో, తత్ = దానిని, కురుతే = చేయుచున్నాడు, తస్య = అట్టి ఆత్మజ్ఞానికి, భయం = భయము, కుత్రచిత్ = ఎక్కడగూడ, న = లేదు.

తా॥ అద్వైతజ్ఞానమువలననే ద్వైతమునకు బాధకలుగుచున్నది. మరియు ద్వైతమునకు బాధ కలుగుటచేతనే భయకారణమైన అజ్ఞానము జ్ఞానికి లేకున్నది. తత్పద త్వంపదార్థముల యొక్క లక్ష్యార్థమును భాగత్యాగలక్షణచేతను, మహావాక్యములవలనను అభేదముతో దేనిని తెలుసుకొనుచున్నాడో, అదే అద్వైతజ్ఞానము. ఎవనికీయద్వైతజ్ఞానము ప్రాప్తించినదో అతడే జ్ఞాని. అతడు బాధితానువృత్తివలన సంపూర్ణముగా వ్యవహారములను చేయుచున్నను, అతనికి యెవనియొక్క భయమును లేదు. ఎందుకనగా అతనికి భయముయొక్క అనగా ద్వైతజ్ఞానముయొక్క బాధ కలిగిపోయినది. ఈ విషయమును శ్రుతిభగవతి గూడ చెప్పుచున్నది:

"ద్వితీయాద్వై భయం భవతి"

ద్వైతమువలన నిశ్చయముగా భయము కలుగుచున్నది.

"ఉదరమంతరం కురుతే౽థ తస్య భయం భవతి"

కొంచెమైనను భేదదృష్టిగలవానికి భయము కలుగుచున్నది.

"అన్యో౽సావన్యో౽హమస్మీతి న స వేద యథా పశుః"

ఎవడు తనకంటె బ్రహ్మము భిన్నమని తలంచి ఉపాసించు చున్నాడో వాడు పశువువలె బ్రహ్మము నెరుగజాలడు.

"బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి"

బ్రహ్మవేత్త బ్రహ్మరూపుడే యగుచున్నాడు.

"తరతి శోకమాత్మవిత్"

ఆత్మవేత్త సంసారరూపశోకమునుండి తరించుచున్నాడు. ఈ శ్రుతివాక్యములవలనగూడ జ్ఞానికి దేహపతనమునకు ముందేగాక భయము లేదనియు, ముందుగా అతని దృష్టిలో రెండవవస్తు వేదియు లేదనియు సిద్ధమగుచున్నది.

ఇది నాలుగవ ప్రకరణము

ఓమ్

# అష్టావక్రగీత

## ఐదవ ప్రకరణము

## ఆచార్యోక్తలయచతుష్కము



అవ॥ జనకమహారాజు చెప్పిన ఉల్లాసత్రయమువలన శిష్యుని పరీక్షించినవాడై అష్టావక్రమునీంద్రుడు యిప్పుడు జనకునకు లయయోగము నుపదేశించుచున్నాడు.

శ్లో॥ న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధః త్యక్తుమిచ్ఛసి ।
సంఘాతవిలయం కుర్వన్నేవమేవ లయం వ్రజ ॥ 1

టీక॥ తే = నీకు, కేనాపి = దేనితోనైనను, సంగః = సంగమము, నాస్తి = లేదు, (అతః = ఈ కారణమువలన), శుద్ధః = శుద్ధుడవైన నీవు, కిం = దేనిని, త్యక్తుం = విడుచుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు, ఏవమేవ = ఈ ప్రకారముగానే, సంఘాతవిలయం = దేహాద్యభిమాన సంఘాతత్యాగమును, కుర్వన్ = చేయుచున్నవాడవై, లయం = మోక్షమును, వ్రజ = పొందుము.

తా॥ ఓ శిష్యా! నీవు శుద్ధబుద్ధస్వరూపుడవు. అహంకారమమకారములకు ఆస్పదరూపములైన దేహగేహాదులతో నీకెట్టి సంబంధమునులేదు. ఎప్పుడు నీవు అసంగుడవును, శుద్ధ

డవును ఏతివో అప్పుడు మరల [illegible] లెక్కడనున్నవి? ఇందువలన నీవు [illegible] పరచి అనగా "నేను దేహమును [illegible] ప్రకారమగు అహంకారమును దూరి [illegible] నందు నిలువుము.

శ్లో॥ ఉదేతి భవతో విశ్వం వారిధేరివ [illegible]
ఇతి జ్ఞాత్వైకమాత్మానమేవమేవ [illegible] 2

టీక॥ వారిధేః = సముద్రమునుండి, [illegible] నీనుండి, విశ్వం = ప్రపంచము, [illegible] ఇట్లని, ఏకం = ఒకటేయైన, ఆత్మా[illegible] ప్రకారముగానే, జ్ఞాత్వా = [illegible] మోక్షమును, వ్రజ = పొందుము.

తా॥ ఎట్లు సముద్రమునందు బుడ్బుదములు, [illegible] ములు ఉత్పన్నములై మరల సముద్రమునందే లయము [illegible] చున్నవో, సముద్రమునకంటె భిన్నములుగావో, [illegible] కల్పమువలన యీ జగత్తు ఉత్పన్న[illegible] లయమగుటతోడనే జగముకూడా [illegible] భాగవతమున చెప్పినదానిని చూడుము:

"శుద్ధో ముక్తస్సదైవాత్మా న [illegible]
బంధమోక్షౌ మనస్సంస్థౌ తస్మి[illegible] ప్రశామ్యతి।"

ఆత్మ యెల్లప్పుడు శుద్ధమై మరియు ముక్తమైయున్నది. అది యెుకప్పుడును బంధమును పొందియుండలేదు. బంధమోక్షములు రెండును మనోధర్మములు. మనస్సు ప్రశాంతి నొందినచో బంధ మోక్షముల పేరేయుండదు. ఆత్మయందు మనస్సును లయ మొనరించినచో సమస్తప్రపంచముకూడ లయమగుచున్నది.

శ్లో॥ ప్రత్యక్షమప్యవస్తుత్వాద్విశ్వం నాస్త్యమలే త్వయి।
రజ్జుసర్ప ఇవ వ్యక్తమేవమేవ లయం వ్రజ ॥ 8

టీక॥ వ్యక్తం = దృశ్యమానమగు, విశ్వం = సంసారము, ప్రత్యక్షమపి = ప్రత్యక్షమైనదైనప్పటికినీ, అవస్తుత్వాత్ = వాస్తవముగా లేనిదై నందున, అమలే = మలరహితుడవగు, త్వయి = నీయందు, రజ్జుసర్ప ఇవ = రజ్జువునందు సర్పమువలె, నాస్తి = లేదు, ఏవమేవ = ఈ ప్రకారముగానే, లయం = శాంతిని, వ్రజ – పొందుము.

తా॥ ప్రశ్న॥ ప్రత్యక్షప్రమాణమువలన రజ్జువునందు సర్పాదికమునకు భేదప్రతీతి కలుగుచున్నది. ఏ వస్తువు ప్రత్యక్ష ప్రమాణమునకు విషయమో అది లయము నొందదు అని వున్నందున దానికి లయమెట్లు సాధ్యమగును?

ఉ॥ ప్రత్యక్షప్రమాణమునకు విషయమైనదానికిగూడ శాస్త్రమువలన బాధ కలుగుచున్నది. ఎట్లనగా చంద్రమండలము ప్రత్యక్షప్రమాణమువల్లనైతే ఒక బెత్తెడు స్థలములో చూపించ బడుచున్నది. అయితే జ్యోతిషశాస్త్రమునందు అది పదివేల

యోజనముల పరిమితిగలదని లిఖింపబడియున్నది. ఆ శాస్త్రము చేతబెత్తెడు అంగీకరింపబడలేదు. అదేవిధముగా ప్రత్యక్షప్రమాణమునకు విషయమైన యీ జగత్తుగూడ శ్రుతివాక్యములచే బాధితమగుచున్నది. ఎందుకనగా జగత్తు వాస్తవముగా మూడు కాలములయందును లేదు. ఎట్లు స్వప్నసృష్టియు, గంధర్వనగరాదికములును మూడుకాలములయందును లేవో, అట్లే యీ జగత్తుగూడ యే కాలమునందును లేదు అని యీ ప్రకారమగు చింతనయే జగల్లయమునకు హేతువగుచున్నది.

శ్లో॥ సమదుఃఖసుఖః పూర్ణ ఆశానైరాశ్యయోః సమః ।
సమజీవితమృత్యుస్సన్నేవమేవ లయం వ్రజ ॥ 4

టీక॥ సమదుఃఖసుఖః = సుఖదుఃఖములయందు సమత్వముగలవాడవై, పూర్ణః = పరిపూర్ణుడవై, ఆశానైరాశ్యయోః = ఆశా నిరాశలయందు, సమః = సమభావముగలవాడవై, సమజీవితమృత్యుః = జీవితమృత్యువులయందును తుల్యుడవై, ఏవమేవ సన్ = ఈ ప్రకారముగా అయినవాడవై, లయం = బ్రహ్మదృష్టిని, వ్రజ = పొందుము.

తా॥ ఓ జనకుడా! నీవు ఆత్మానందస్వరూపుడవగుటవలన పూర్ణుడవు. దైవయోగమువలన శరీరమునం దుత్పన్నములైన సుఖదుఃఖములయందును సమానుడవు. ఆశ నిరాశలయందును సముడవు. జీవించుట మరణించుటయందును సమానుడవు. నీవు నిర్వికారుడవు. సుఖదుఃఖాదికములన్నియు అనాత్మధర్మములు,

మరియు మిథ్యాభూతములు. వీటికి కారణభూతమగు దేహాదికము గూడ మిథ్యయే. ఉత్పత్తికంటె పూర్వమెట్లు దేహాదికములేదో, నాశానంతరముగూడ దేహామట్లు లేదు. కాని మధ్యయందు మాత్రము ప్రతీతమగుచున్నది. ఏ వస్తువు ఉత్పత్తికంటె పూర్వము నాశానంతరములేదో, అది మధ్యయందుగూడ వాస్తవముగ లేదు. కేవలము ప్రతీతము మాత్రము అగుచున్నది. స్వప్నపదార్థములెట్లు మిథ్యాభూతములో అట్లే యీ జగత్తు గూడ మిథ్యయైయున్నది. వాస్తవమునందు మూడు కాలముల యందును లేదు. కేవలబ్రహ్మము బ్రహ్మమే యైయున్నది.

"సర్వం ఖల్విదం బ్రహ్మ"

ఈ సంపూర్ణజగత్తు నిశ్చయముగా బ్రహ్మరూపమేయైయున్నది. ఈ విధమగు చింతనకే లయచింతనయని పేరు.

ఇది ఐదవప్రకరణము



ఓమ్

# అష్టావక్రగీత

## ఆరవ ప్రకరణము

### ఉత్తరచతుష్కము

అవ॥ ఈ విధముగా తనను పరీక్షించుటకు గురువు లయయోగము నుపదేశింపగా శిష్యుడు పూర్ణాత్ముడగువానికి లయాదులతో పనిలేదని మనవి చేయుచున్నాడు.

శ్లో॥ ఆకాశవదనంతోఽహం ఘటవత్ప్రాకృతం జగత్।
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః॥ 1

టీక॥ అహం = నేను, ఆకాశవత్ = ఆకాశమువలె, అనంతః = అంతములేనివాడను, జగత్ = ప్రపంచము, ఘటవత్ = ఘటమువలె, ప్రాకృతం = ప్రకృతిజన్యమైనది, తథా = ఆ కారణమువలన, ఏతస్య = దీనికి, త్యాగః = త్యాగము, న = లేదు, న గ్రహః = గ్రహణములేదు, న లయః = లయములేదు, ఇతి జ్ఞానం = ఇదియే జ్ఞానము.

తా॥ లయచింతనారూపమైన యోగముకూడ నాయందు సంభవింపదు. ఏది పుట్టుచున్నదో అదియే లయమగుచున్నది. ఏ పదార్థమునకు మూడు కాలములయందును ఉత్పత్తిలేదో దానికి లయముకూడలేదు. ఎట్లు వంధ్యాపుత్రుడు, శశశృంగము

యీా మొదలగువాటికి ఉత్పత్తిలయములుకూడాలేవో, అదేవిధముగ యీా జగత్తు ఉత్పన్నమైయుండలేదు; ఇక కాబోదు; ఇప్పుడున్నూ (వర్తమానకాలమునందు) లేదు. అటువంటప్పుడు జగత్తుయొక్క లయచింతన యెట్లు సాధ్యమగును? ఎప్పుడును సాధ్యపడదు.

ప్రశ్న॥ జగత్తునకు ఉత్పత్తియే లేనిచో నది యెట్లు ప్రతీతమగుచున్నది?

ఉ॥ దీనికి సమాధానము మాండూక్యకారికలలో చెప్పిన దానిని చూడుము:

"ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా।
వితథైస్సదృశాః సంతోఽవితథా ఇవ లక్షితాః॥
స్వప్నమాయే యథా దృష్టే గంధర్వనగరం తథా।
తథా విశ్వమిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః॥

అనగా ఏ పదార్థము ఉత్పత్తికి ముందుగను, నాశమునకు అనంతరమునను లేదో అది వర్తమానకాలమునందును లేదు. అయితే లేనిదియయ్యు ఉన్నదానివలె వర్తమానకాలమునందు ప్రతీతమగుచున్నది. ఎట్లు స్వప్నమునందు దృష్టములగు ఏనుగు, గుఱ్ఱము మొదలగునవి, యింద్రజాలముచేత సృష్టించబడిన వస్తువులు, మరియు గంధర్వనగరము యివన్నియు లేనివియయ్యు ప్రతీతములగుచున్నవో, అట్లే యీా ప్రపంచముకూడ లేనిదయ్యు

తోచుచున్నది. జ్ఞానులు యిటువంటి అనుభవముచేతనే కేవలా ద్వైతానంతస్వరూపపరబ్రహ్మ మొక్కటియే సత్యమైనదనియు, మరియు నీ సమస్తప్రపంచము ప్రతీతిమాత్రమేగాని వాస్తవము నందు లేనిదనియు వేదాన్తశాస్త్రములద్వారా తెలుసుకొను చున్నారు.

ప్రశ్న॥ అనంతస్వరూపాత్మకు దేహాదులయం దెట్లు ఉనికి సాధ్యమగును? పెద్దవస్తువు చిన్నవస్తువునం దెట్లు యిమిడియుండ గలదు?

ఉ॥ ఘటము, మఠము మొదలగునవి ఆకాశముయొక్క ఉనికి కెట్లు స్థానములగుచూ దానినుండి భేదములుగూడ నగు చున్నవో, అట్లే దేహాదికములుగూడ అనంతస్వరూపాత్మకు నివాసస్థానములగుచూ, దానినుండి భిన్నములుగూడ నగుచున్నవి. వాస్తవమునందు యీ జగత్తు మిథ్యాభూతమగు మాయాకార్య మగుటవలన అదియు మిథ్యయే. ఈ ప్రకారముగా వేదాన్తము వలన సిద్ధమైన జ్ఞానమే అనుభవరూపమై జగత్తుయొక్క మిథ్యా త్వమునందు ప్రమాణమగుచున్నది. ఇందువలన జగత్తునకు లయ చింతనాదికము కాజాలదు.

అవ॥ ఘటాదికములు భిన్నములైనట్లు దేహాత్మలు భిన్నములగునని శంక కలుగునుగాన నట్టి సందేహనివృత్తికై యింకొక దృష్టాంతము.

శ్లో॥ మహోదధిరివాహం స ప్రపంచో వీచిసన్నిభః ।
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః॥ 2

టీక॥ అహం = నేను, మహోదధిరివ = సముద్రసదృశుడను గావున్నాను, సః = ఆ, ప్రపంచః = ప్రపంచము, వీచిసన్నిభః = తరంగములతో తుల్యమైనది, తథా = ఆ కారణమువలన, ఏతస్య = దీనికి, త్యాగః = త్యాగము, న = లేదు, గ్రహః = గ్రహణము, న = లేదు, లయః = లయము, న = లేదు.

తా॥ ప్ర॥ ఘటాకాశదృష్టాంతమువల్లనైతే దేహమునకు, ఆత్మకు భేదశంక ఉత్పన్నమగుచున్నది. ఎట్లు ఘటముకంటె ఆకాశమును, ఆకాశముకంటె ఘటమును భిన్నములో, అట్లే దేహముకంటె ఆత్మయు, ఆత్మకంటె దేహమును భిన్నమగుచున్నది. రెండింటికి భిన్నత్వమున్నప్పుడే ద్వైతప్రమాణమగును. అద్వైతాత్మకు ప్రమాణము లేదుగదా?

ఉ॥ ఆత్మ గొప్ప సముద్రమువలె నున్నది. దానియందు ప్రపంచము తరంగములవలెనున్నది. ఈ ప్రకారమగు ఆత్మానుభవరూపజ్ఞానమే అద్వైతమునకు ప్రమాణమైయున్నది.

శ్లో॥ అహం స శుక్తిసంకాశో రూప్యవద్విశ్వకల్పనా ।
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః॥ 3

టీక॥ సః = ఆ, అహం = నేను, శుక్తిసంకాశః = ముత్యపుచిప్పతో సమానుడను, విశ్వకల్పనా = ప్రపంచకల్పనము, రూప్యవత్ = వెండితో సమానముగా నున్నది, తథా = ఆకారణమువలన, ఏతస్య = దీనికి, త్యాగః న = త్యాగములేదు, గ్రహః = గ్రహణము, న = లేదు, లయః = లయము, న = లేదు.

తా॥ ప్ర॥ ఎట్లు తరంగములన్నియు సముద్రముయొక్క- వికారములో, సముద్రము వికారియో అట్లే దేహము ఆత్మ యొక్క- వికారము, ఆత్మ వికారి యని సిద్ధించుచున్నదిగదా ?

ఉ॥ వికార—వికారిభావము సావయవపదార్థములకేగాని నిరవయవపదార్థములకు లేదు. ఇందువల్ల నీ దృష్టాంతము సార్థకమగుటలేదు. కాన నేను దృష్టాంతమును చెప్పుచున్నాను వినుము. ఎట్లు శుక్తి సత్యరూపమై దానియందు ప్రతీతమగు రజతము మిథ్యయో అట్లు దేహాదిక సమస్తప్రపంచమునకు అధిష్ఠానభూతుడనైన నేను సత్యస్వరూపుడను. ఈ ప్రపంచ మంతయు శుక్తియందు రజతమువలె నాయందు కల్పితమైనది. కావున ద్వైతము త్రికాలములయందును సిద్ధము కాజాలదు.

శ్లో॥ అహం వా సర్వభూతేషు సర్వభూతాన్యథో మయి ।
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః॥

టీక॥ అహం = నేను, వా = నిశ్చయముగా, సర్వభూతేషు = సమస్తభూతములయందును, అథో = మరియు, సర్వభూతాని = సకలభూతములును, మయి = నాయందును (సంతి = ఉంటున్నవి), తథా = ఈ కారణమువలన, ఏతస్య = దీనికి, న త్యాగః = త్యాగములేదు, న - గ్రహః = గ్రహణములేదు, న - లయః = లయమున్ను లేదు, ఇతి = ఈ ప్రకారమైనదే, జ్ఞానం = జ్ఞానము.

తా॥ ప్ర॥ శుక్తియందు రజతదృష్టాంతమువల్లకూడా ఆత్మకు పరిచ్ఛిన్నతాశంక కలుగుచున్నది. ఎందుకనగా యెట్లు శుక్తి

పరిచ్ఛిన్నమును ఏకదేశవర్తియునై యున్నదో, అట్లే ఆత్మయు పరిచ్ఛిన్నమును ఏకదేశవర్తియు కావలసివచ్చునుగదా?

ఉ॥ నేనే సకలభూతములయందును వ్యాపకతారూపముతో మణులయందు సూత్రమువలె ఉంటున్నాను. నేనే అంతటికి అధిష్ఠానరూపుడనై సత్తాను, మరియు స్ఫూర్తిని యిచ్చువాడనుగా నున్నాను. నాయందే యీ సర్వప్రపంచము ఆకాశమునందు నీలిమమువలె అధ్యస్తమైయున్నది (అధ్యస్తమనగా లేనిది ఉన్నట్లు తోచుట). ఈ ప్రకారములగు వేదాన్తవాక్యములచేత సిద్ధమైన జ్ఞానము — అనగా అనుభవము ఆత్మ అద్వైతమగుటయందు (అనుటయందు) ప్రామాణికమైయున్నది. 'నేనే' ఉన్నప్పుడు యిక నాయందు త్యాగము, గ్రహణము, లయచింతనాదికముకూడ ఉండజాలదు.

ఇది ఆరవప్రకరణము



ఓమ్

# అష్టావక్రగీత

## ఏడవ ప్రకరణము

### అనుభవపంచకము



అవ॥ ఐదవప్రకరణమునందు చెప్పినటుల లయయోగము లేనియెడల సంసారవిక్షేపము తప్పదను శంక రాగా లయములేకున్నను లోపములేదని శిష్యుడు తన యనుభవమును చెప్పుచున్నాడు.

శ్లో॥ మయ్యనంతమహాంభోధౌ విశ్వపోత ఇతస్తతః ।
భ్రమతి స్వాంతవాతేన న మమాస్త్యసహిష్ణుతా ॥ 1

టీక॥ అనంతమహాంభోధౌ = అపారమహాసముద్రమువలెనున్న, మయి = నాయందు, విశ్వపోతః = ప్రపంచరూపనావ, స్వాంతవాతేన = మనోరూపవాయువుచేత, ఇతస్తతః = ఇటునటు, భ్రమతి = తిరుగుచున్నది, (పరంతు = అయితే) మమ = నాకు, అసహిష్ణుతా = అసహనశీలత, నాస్తి = లేదు.

తా॥ ప్రశ్న॥ లయచింతనము లేనిచో సాంసారికవిక్షేపములు కలుగును. ఒకప్పుడుగూడ అవి దూరముకావు కదా?

ఉ॥ ఆ విక్షేపములు ఉండునుగాక. వాటినుండి నాకేమి హాని? అనంతమహాసముద్రరూపుడనగు నా (ఆత్మ)యందు

యీ విశ్వరూపమైన నౌక, మనోరూపవాయువుచే యిటునటు తిరుగుచున్నది. దాని భ్రమణమువలన నాకేమియు అసహిష్ణుత్వములేదు. అనగా నేనేమియు క్షుభితుడను కాలేను. సముద్రమునందు ఝంఝామారుతముచేత యిటునటు కొట్టుకొనుచున్న నౌక సముద్రము నెట్లు క్షుభితము చేయజాలదో, అట్లే మనోరూపవాయువుచే అటునిటు భ్రమించుచున్న విశ్వరూపనౌక గూడ సముద్రరూప ఆత్మను సంక్షోభ పెట్టజాలదు.

అవ॥ జగద్వ్యాపారమువలన తనకెట్టిలోపమును లేదని చెప్పియున్నాడు. ఇప్పుడు జగదుత్పత్తిలయములవలనగూడ యేలోపమును లేదని నిరూపించుచున్నాడు.

శ్లో॥ మయ్యనంతమహాంభోధౌ జగద్వీచిః స్వభావతః ।
ఉదేతు వాఽస్తమాయాతు న మే వృద్ధిర్న చ క్షతిః॥ 2

టీక॥ అనంతమహాంభోధౌ = అపారమహాసముద్రరూపుడనగు, మయి = నాయందు, జగద్వీచిః = జగద్రూపమగు కల్లోలము, ఉదేతు = ఉదయించునుగాక! వా = లేనిచో, అస్తం = లయమును, ఆయాతు = పొందునుగాక! మే = నాకు, వృద్ధిః = వృద్ధియు, న = లేదు, క్షతిః = హానియును, న = లేదు.

తా॥ వినాశరహితమైనట్టియు, వ్యాపకమైనట్టియునగు ఆత్మరూపమహాసముద్రమునందు జగద్రూపములగు అనేకతరంగములు ఉదయించుచున్నవి. మరల దానియందే లయించుచున్నవి. తరంగోదయమువలనగాని, అస్తమయమువలనగాని సముద్రునకెట్టి

హానివృద్ధులు లేనట్లు, జగదుత్పత్తివలన ఆత్మకు వృద్ధియు లేదు; దాని లయమువలన ఆత్మకు హానియు లేదు.

అవ॥ పైనిచెప్పిన దృష్టాంతమువలన ఆత్మవికారమే జగత్తు అనెడి భ్రమ కలుగవచ్చునని, తన్నివృత్తికై ప్రకారాంతరముగా చెప్పుచున్నాడు.

శ్లో॥ మయ్యనంతమహాంభోధౌ విశ్వం నామ వికల్పనా ।
అతిశాంతో నిరాకార ఏతదేవాహమాస్థితః ॥ 3

టీక॥ అనంతమహాంభోధౌ = అనంతమహాసముద్రమువలెనున్న, మయి = నాయందు, నామ = నిశ్చయముగా, విశ్వం = ప్రపంచము, వికల్పనా = కల్పనామాత్రమైయున్నది, అహం = నేను, అతిశాంతః = అత్యంత శాంతస్వరూపుడను, నిరాకారః = నిరాకారుడను, చ = మరియు, ఏతదేవ = ఈ ఆత్మకు, ఆస్థితః = ఆశ్రయుడనైయున్నాను.

తా॥ అనంతమహాసముద్రరూపుడనగు నాయందు కల్పింపబడిన యీ విశ్వము భ్రమమాత్రమైయున్నది గాని వాస్తవమునందు లేదు. ఎందుకనగా నా యనంతస్వరూపము నిరాకారమైయున్నది. నిరాకారమునుండి సాకారోత్పత్తి పొసగదు. ఆత్మయందు జగత్తుయొక్క వాస్తవోత్పత్తియే లేనప్పుడు, నేను ప్రపంచరహితమైన శాంతస్వరూపుడనై వుంటున్నాను. కాన నాయందు లయయోగాదికమునుగూడ కల్పించుట ఉచితముగాదు.

శ్లో॥ నాత్మా భావేషు నో భావస్తత్రానంతే నిరంజనే ।
ఇత్యసక్తోఽస్పృహశ్శాంత ఏతదేవాహమాస్థితః ॥ 4

టీక॥ ఆత్మా = ఆత్మ, భావేషు = దేహాదిభావములయందు, న = లేదు, భావః = దేహాదికభావము, తత్ర = ఆ, అనంతే = అనంతమైన, నిరంజనే = నిరంజన (నిర్ద్వంద్వ)మైన ఆత్మయందు, నో = లేదు, ఇతి = ఈ ప్రకారముగా, అసక్తః = సంగరహితుడనైన, శాంతః = శాంతుడనైన, అహం = నేను, ఏతదేవ = ఈ యాత్మస్వరూపుడనైయ్యే, ఆస్థితః = ఉంటున్నాను.

తా॥ ఆత్మ దేహాదులయందు ఆధేయ (ఆశ్రిత)రూపముగా నుండలేదు. ఎందుకనగా ఆత్మ వ్యాపకము, దేహము పరిచ్ఛిన్నమైయున్నది. వ్యాపకము పరిచ్ఛిన్నమునకు ఆశ్రితము కాదు. ఆత్మ సత్యమైనదగుటచేతను, దేహము మిథ్యయగుటచేతను నిరాకారమైన ఆత్మ దేహాదులకు ఉపాధి కాజాలదు. సత్యవస్తువు మిథ్యావస్తువునకు ఉపాధి కాజాలదు. మరియు ఆత్మ అనంతమును, నిరంజనమును అగుటవల్లను, దేహము అంతముగలది నాశముగలది యగుటచేతను దేహేంద్రియములు ఆత్మకు ఉపాధి కాజాలవు. ఈ కారణమువలన ఆత్మసంబంధరహితమైనది, ఇచ్ఛాదికరహితమైనది, మరియు శాంతస్వరూపమైయున్నది.

శ్లో॥ అహో చిన్మాత్రమేవాహమింద్రజాలోపమం జగత్ ।
అతో మమ కథం కుత్ర హేయోపాదేయకల్పనా॥ 55

టీక॥ అహం = నేను, చిన్మాత్రం = చైతన్యమాత్రస్వరూపుడను, జగత్ = ప్రపంచము, ఇంద్రజాలోపమం = ఇంద్రజాలముతో సమానమైనది, అతః = ఈ కారణమువలన, మమ = నాకు, హేయోపాదేయ

కల్పనా — హేయ = త్రోసివేయుట, ఉపాదేయ = తీసికొనుట యనెడి, కల్పనా = కల్పన, కుత్ర = దేనియందు, కథం = యెట్లు, (క్రియతే = చేయబడుచున్నది.)

తా॥ నాయొక్క అనగా ఆత్మసత్తాతోను, బలముతోను ప్రతీతమై స్వకీయసత్తా కించిత్తైనను లేని యీ సంపూర్ణజగత్తు యింద్రజాలముతో సమానమైయున్నది. నేనో చైతన్యరూపుడను. ఈ కారణమువలన జగత్తుకు తనసత్తా కొంచెమైనను లేనందున నాకు యే పదార్థమునందును యెటువంటి త్యాగబుద్ధిగాని, గ్రహణబుద్ధిగాని చేయసక్కరలేదు. ఎవడు జగత్పదార్థములు సత్యమైనవని తలంచుచున్నాడో, అతనికే వాటియందలి త్యాగబుద్ధిగాని, గ్రహణబుద్ధిగాని గలుగుచున్నది.

ఇది ఏడవ ప్రకరణము



ఓమ్

# అష్టావక్రగీత

## ఎనిమిదవ ప్రకరణము

### బంధమోక్షవ్యవస్థాచతుష్కము



అవ॥ ముందటి ఏడు ప్రకరణములద్వారా అష్టావక్రమునీంద్రుడు అన్ని విధముల జనకుని అనుభవమును పరీక్షించెను. ఇప్పుడు యీ ఎనిమిదవ ప్రకరణమునందు నాలుగు శ్లోకములద్వారా శిష్యుని ఆత్మానుభవమును శ్లాఘించుచున్నాడు.

శ్లో॥ తదా బంధో యదా చిత్తం కించిద్వాంఛతి శోచతి।
కించిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి ॥ 1

టీక॥ యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, కించిత్ = ఏకొంచెమైనను, వాంఛతి = కోరుచున్నదో, శోచతి = దుఃఖించుచున్నదో, ముంచతి = విడుచుచున్నదో, గృహ్ణాతి = గ్రహించుచున్నదో, హృష్యతి = సంతోషించుచున్నదో, కుప్యతి = కోపించుచున్నదో, తదా = అప్పుడు, బంధః = బంధము, (భవతి = అగుచున్నది.)

తా॥ ఓ జనకుడా! అనంతాత్మస్వరూపుడనగు నాయందు త్యాజ్యగ్రహణముల కల్పనయే లేదని నీవు పూర్వము చెప్పినదెంతో బాగున్నది. అదియే సరియైనది. ఎందుకనగా, మనస్సు

విషయేచ్ఛగలదియై ఒకానొక పదార్థమును పొందుటకు యిచ్ఛయించి, అది లభ్యముకానిచో దుఃఖించుచున్నది; కష్టపడుచున్నది. అప్పుడు దానిని త్యజించుటకుగూడ సంకల్పించుకొనుచున్నది. మరల లుబ్ధత్వముత్పన్నమైనప్పుడు దానిని గ్రహింపగోరుచున్నది. వస్తువు లభ్యమైనచో సంతోషించుచున్నది. లభ్యముగానిచో కోపోద్రిక్తమగుచున్నది. ఈ ప్రకారముగా మనస్సెప్పుడు అనేకవాసనలతో యుక్తమగుచున్నదో, అప్పుడు జీవునకు బంధము కలుగుచున్నది. యోగవాసిష్ఠమునందు గూడ యీ విషయము చెప్పబడినది —

"స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితాం।
ఆపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్॥"

అనగా — భార్యాబిడ్డలయందలి స్నేహముచేతను, ధనమునందలి లోభముచేతను, మణులు స్త్రీలు మొదలగువాటియొక్క ప్రాప్తివలనను చిత్తము పొంగిపోవుచున్నది. వాటి వియోగమువలన క్రుంగిపోవుచున్నది.

"బంధో హి వాసనాబంధో మోక్షస్స్యాద్వాసనాక్షయః।
వాసనాస్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ॥"

చిత్తమునందలి అనేకప్రకారములగు భోగములయొక్క వాసనలే పురుషునికి బంధకారణములగుచున్నవి. సమూలముగా వాసనాక్షయమైపోవుట పేరే మోక్షము. ఓ రామా! ఎప్పుడు నీవు

వాసనాత్యాగమును చేయుదువో, మరియు మోక్షేచ్ఛనుగూడ చేయవో అప్పుడు నీవు సుఖివి కాగలవు.

ప్రశ్న॥ "మనస్సు వాసనలతో నిండిపోయినప్పుడు మరి ముక్తి కలుగదు." అని గదా తమరు చెప్పుచున్నారు. అట్లే యైనచో మరి యీ ప్రపంచములో నిర్వాసనికపురుషుడే కనబడడు. ఎందుకనగా గృహస్థులెందరున్నారో అందరి మనస్సులు స్త్రీలయో, పుత్రులో, ధనములో వీట్లయొక్క ప్రాప్తికొరకుగాని, ప్రాప్తవస్తురక్షణకొరకుగాని గల వాసనలతో నిండింపబడియే యుండును. ఒకవేళ యెవడైన ఈశ్వరధ్యానముగలిగి, దానధర్మాదిపుణ్యకార్యములు చేయువాడైనచో, అతని మనస్సులో కూడ, "ఈశ్వరా! నా కీసంపదలు యెల్లప్పుడు ఉండుగాక! ఏ కోరికయులేక, యేమియులేక చేయునదేమున్నది?" అను వాసన వుంటున్నది. మరియు యెంతమందో త్యాగులు, సాధువులు, సన్న్యాసులు, మహాత్ములైనవారుగూడ 'మా హృదయములలోగూడ యింకా యెన్నో కోరికలున్న'వని చెప్పుచున్నారు. కొందరు మఠములను నిర్మించుచున్నారు. కొందరు పరివారమును, శిష్యగణమును అభివృద్ధి పరచుచున్నారు. మరికొందరు సంచారకార్యక్రమములను యేర్పరచుకొనుచున్నారు. కాని నిర్వాసనిక (వాసనారహితుడగు) పురుషుడు వీరలలోనొక్కడును కనబడడు. మరి వీరు వాసనారహితులేయైనచో యీ వేషములు, యీ యాడంబరములు, యీ మఠములు, యీ శిష్యబృందములు

యెందుకు? వీటి నభివృద్ధిపరచు టెందులకు? ఎందుకీసంసారమును ఉత్పత్తిచేయుట? అందరూ యేదో ఒకరూపమైన సంసారమునే ఉత్పత్తిజేసి, అభివృద్ధిపరచినచో నిక నిందులో సన్న్యాసియెవడు? సంసారియెవడు? ఈ స్థితిలో మనకు ఒక్కడు గూడ జ్ఞాని లభింపడు. జ్ఞానియే లేనిచో మరి ముక్తిమాటనే యెత్తనక్కరలేదు. అనగా మరి ముక్తియే లేదని చెప్పవచ్చును.

ఉ॥ ఒక వనములో ఒకే సింహము, మరియు లక్షలాది నక్కలు, యితరమృగము లుండునట్లు, యీ సంసారరూపమైన లేక గృహస్థాశ్రమరూపమైన లేక సన్న్యాసాశ్రమరూపమైన అరణ్యములో వాసనలనుండి రహితుడైన పురుషుడు యే ఒక్కడో విరళముగా నుండును. అయితే వాసనలతో నిండినవారనేకు లుందురు. సింహముచేత చంపబడిన జంతుశవము నెట్లు నక్కలు మొదలగునవి భక్షించుచున్నవో, అట్లే వాసనారహితుడగు పురుషుని (విరాగి) చిహ్నములను ధరించుకొని, అనగా జ్ఞాన సంబంధమైన మాటలను వినిపించుచు, వైరాగ్యాదులను చూపుచు యీ వంచకసన్న్యాసులు, గృహస్థులైయున్న ఆచార్యపురుషులు అనేకమంది మూఢజనులను వంచించుచున్నారు. వారే సంసారము (ప్రపంచము)నందు నక్కలవంటివారు.

ఈ విషయమై ఒక దృష్టాంతము చెప్పబడుచున్నది. ఒక గ్రామమునందు కొందరు సాలె (నేత) వాండ్రుండిరి. ఒక దినమున వారందరు "పదండి, యీ రాత్రి క్షత్రియులగ్రామాలు

లూటీ చేయుదము" అని వారిలో వారనుకొని అదేవిధముగ వారందరు కలిసి రాత్రి క్షత్రియగ్రామములను కొల్లగొట్టుటకై వెళ్లిరి. అది తెలుసుకొని క్షత్రియులు ఆయుధములను తీసికొని వీరిని కొట్టుటకు యెప్పుడు వెంటబడిరో అప్పుడు యీ సాలె వాండ్రందరు పారిపోయిరి. అప్పుడందులో నొకడు, "సోదరులారా! మనము యేలాగూ పారిపోతూనే ఉన్నాము. కాన పరుగెత్తుచు 'కొట్టు, బాగా కొట్టు' అంటూ పరుగెత్తండి" అని అనెను. అది విని వారందరున్ను అట్లే చెప్పుకుంటూ పరిగెత్తిపోయిరి. అదేవిధముగ పెక్కుమంది ఆడంబరజ్ఞానులు జ్ఞానసాధనలనుండి దూరముగా పారిపోవుచూ యితరులతో మాత్రము "వాసనలను విడిచిపెట్టండి, జ్ఞాన ధారణను చెయ్యండి, యీ ప్రపంచమంతా మిథ్య, వట్టిదే" అని చెప్పుచున్నారు. కాని దంభజ్ఞానులగువారుమాత్రము జ్ఞానసాధనలను చేయజాలరు. ఎవడు సమస్తవాసనారహితుడో, అతడే నిజమగు జ్ఞాని. వాసనావాసితుడే బద్ధుడు.

శ్లో॥ తదా ముక్తిర్యదా చిత్తం న వాంఛతి న శోచతి।
న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి॥ 2

టీక॥ యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, న వాంఛతి = కోరదో, న శోచతి = దుఃఖించదో, న ముంచతి = విడిచిపెట్టదో, న గృహ్ణాతి= గ్రహించదో, న హృష్యతి = సంతోషించదో, న కుప్యతి = కోపించదో, తదా = అప్పుడు, ముక్తిః = ముక్తి, (భవతి = అగుచున్నది.)

తా॥ ఎంతవరకు ఒకని మనస్సు భోగప్రాప్తికొరకు ఆశించదో, ఒక వస్తువును గ్రహించుటయందుగాని విడుచుటయందు గాని ఇచ్ఛనిడదో, అదేవిధముగ ఒక పదార్థము లభించునపుడు సంతోషమును, ప్రీతిపాత్రులగువారు పోయినను, వియోగము కలిగినను దుఃఖమును పొందదో, మరి ఒకేవిధముగ ఉన్నదున్నట్లుగా యేకరసమైయుంటున్నదో, అప్పుడే అనగా ఆ కాలము నందే ఆపురుషుడు ముక్తుడగుచున్నాడు.

శ్లో॥ తదా బంధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు।
తదా మోక్షో యదా చిత్తమసక్తం సర్వదృష్టిషు ॥ 3

టీక॥ యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, కాసు = ఎటువంటి, దృష్టిషు= విషయములయందు, సక్తం = ఆసక్తమగుచున్నదో, తదా = అప్పుడు, బంధః = బంధమగుచున్నది, అపి చ = మరియు, చిత్తం = మనస్సు, యదా = ఎప్పుడు, సర్వదృష్టిషు = సమస్తవిషయములయందును, అసక్తం = సక్తముకాదో, తదా = అప్పుడు, మోక్షః = మోక్షము కలుగుచున్నది.

తా॥ మొదట ఒక వాక్యమువలన బంధలక్షణమును, మరల రెండవవాక్యమువలన మోక్షలక్షణమును చెప్పి యిప్పుడు ఒకే వాక్యమువలన బంధమోక్షముల రెండింటిని చెప్పుచున్నాడు. మనస్సెప్పుడు అనాత్మపదార్థములయందు అనాత్మాకారవృత్తిగలది యగుచున్నదో, అదే బంధము. మనస్సెప్పుడు విషయాకారముకాదో, అనగా ఆసక్తిచే రహితమైనదై

ఆత్మదృష్టిగలది యగుచున్నదో అప్పుడే జీవుడు ముక్తుడగు చున్నాడు.

ప్రశ్న॥ ఎప్పుడు మనస్సు విషయాసక్తముకాదో, అప్పుడు మోక్షమనియు, విషయాసక్తమగునప్పుడు బంధమనియు తమరు శెలవిచ్చితిరి. ఒకేమనస్సు కాలభేదముచేత బంధ, మోక్షములకు కారణమగుచున్నదని చెప్పినచో, అప్పుడు ముక్తిగూడ అనిత్యమని చెప్పవలసివచ్చునుగదా?

ఉ॥ ఆ మాటకు యిది తాత్పర్యముగాదు. ఆత్మజ్ఞాన ప్రాప్తికి పూర్వము పురుషు డెంతవరకు విచారశూన్యుడై, విషయాసక్తుడై ఉంటున్నాడో, అంతవరకు జీవుడు బంధమునందే పడియుంటున్నాడు. మరల నెప్పుడు విచారణాయుక్తుడై దోష దృష్టిని తొలగించి విషయములయం దాసక్తుడగుచున్నాడో, మరియు విషయవాసనలయొక్క బీజముకూడ హృదయమునందు లేదో, అప్పుడాజీవుడు ముక్తుడై ఒకప్పుడుగూడ మరల బంధ మును పొందడు. వేచినవిత్తనము మరల మొలకెత్తుటకు సమర్థముగానట్లు, నిర్వాసనికచిత్తముగల పురుషుడు ఒకప్పుడుగూడ పునర్జన్మ నొందడు.

శ్లో॥ యదా నాహం తదా మోక్షో యదాహం బంధనం తదా।
మత్వేతి హేలయా కించిన్మా గృహాణ విముంచ మా॥ 4

టీక॥ యదా=ఎప్పుడు, అహం = నేను (అహంకారము ఉన్నదో) తదా = అప్పుడు, బంధః = బంధము, (భవతి = అగుచున్నది), యదా =

ఎప్పుడు, అహం = అహంకారము, న = లేదో, తదా = అప్పుడు, మోక్షః = మోక్షము, (భవతి = అగుచున్నది,) ఇతి = ఈ ప్రకారముగా, మత్వా = తలంచి, హేలయా = లీలగా, మా గృహాణ = గ్రహించకుము, మా విముంచ = విడిచిపెట్టకుము.

తా॥ ఎంతవరకు పురుషుడు అహంకారయుతుడై, నేను బ్రాహ్మణుడననీ, నేను జ్ఞానిననీ, నేను త్యాగిననీ అనుకొనుచున్నాడో, అంతవరకు అతడెప్పుడును ముక్తుడు కాజాలడు. ఆ విషయమే యిచట చెప్పబడుచున్నది.

“యావత్స్యాత్స్వస్య సంబంధోఽహంకారేణ దురాత్మనా ।
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా ॥

అనగా యెంతవరకు జీవునకు దుష్టమగు అహంకారముతో సంబంధమున్నదో, అంతవరకు ముక్తి లేశమాత్రమైనను అతనికి ప్రాప్తించదు. అదే విషయమును దృఢపరచుచున్నాడు—శరీరాదులతో అహంకారాధ్యాస చేయుచున్నంతవరకు జీవుడెప్పుడును ముక్తుడు కాజాలడు. అహంకారాధ్యాసనివృత్తియైన వెంటనే పరిశ్రమలేకనే అకర్తయు, నభోక్తయునై ముక్తుడగుచున్నాడు.

ఇది ఎనిమిదవ ప్రకరణము

ఓమ్

# అష్టావక్రగీత

## తొమ్మిదవ ప్రకరణము

### నిర్వేదాష్టకము

అవ॥ మొదట శిష్యుడు గురువునకుచెప్పిన అనుభవమునే దృఢపరచు టకు ఇప్పుడు ఎనిమిది శ్లోకములతో వైరాగ్యమును చూపించుచున్నాడు.

శ్లో॥ కృతాకృతే చ ద్వంద్వాని కదా శాంతాని కస్య వా ।
ఏవం జ్ఞాత్వేవ నిర్వేదాద్భవ త్యాగపరోఽవ్రతీ ॥ 1

టీక॥ కృతాకృతే=కర్తవ్యాకర్తవ్యములును, ద్వంద్వాని = సుఖదుఃఖ శీతోష్ణాది ద్వంద్వములును, కస్య = ఎవనికి, కదా = యెప్పుడు, శాంతాని = శాంతించుచున్నవి, ఏవం = యీ ప్రకారము, వా = నిశ్చయముగా, జ్ఞాత్వా = తెలిసికొని, ఇహ = ఈ ప్రపంచమునందు, నిర్వేదాత్ = హేయత్వబుద్ధివలన, అవ్రతీ = ఆగ్రహము లేనివాడవై, త్యాగపరః = త్యాగపరుడవుగా, భవ = అగుము.

తా॥ "ఇది నాకు కర్తవ్యము, ఇది నాకకర్తవ్యము" అను దానికే కృతాకృతమనిపేరు. అనగా అవశ్యము ఇది నాకు చేయు దగినది, ఇది చేయదగదు అను నీ రెంటియందును అభినివేశము (పట్టుదల)ను కలిగియుండకుము. మరియు ద్వంద్వములగు సుఖ

దుఃఖాదులనుండి దూరుడవగుము. ఎందుకనగా ఆరెండు యెప్పు డును, యెవనికిని శాంతిని కలుగజేయవు. ఇందువలన ఓ జనక మహారాజా! నీవు కృతాకృతాదికములను త్యజించుటద్వారా వైరాగ్యమును పొందుము. ఆగ్రహమును (పట్టుదలను, లేక హఠమును) దేనియందును జూపకుము.

అవ॥ చిత్తధర్మత్యాగరూపమగు వైరాగ్యము వేలకొలది జనులలో యే ఒక్కనికిమాత్రమే కలుగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ కస్యాపి తాత ధన్యస్య లోకచేష్టావలోకనాత్ ।
జీవితేచ్ఛా బుభుక్షా చ బుభుత్సోపశమం గతా ॥ 2

టీక॥ హేతాత = ఓ నాయనా! లోకచేష్టావలోకనాత్ = ఉత్పత్తివినాశ రూపమగు లోకస్వరూపక్రియలను చూచుటవలన, కస్య = ఒకానొక, ధన్యస్యాపి=ధన్యునకు మాత్రమే, జీవితేచ్ఛా=జీవింపవలెననెడి కోరిక, బుభుక్షా = భోగేచ్ఛ, బుభుత్సా = జ్ఞానము సంపాదింపవలెననెడి అభిలాష, ఉపశమం = శాంతిని, గతా = పొందుచున్నది.

తా॥ ఓ జనకా! వేలకొలదిజనులలో భాగ్యవంతుడగు యే ఒక్కనికో మనస్సునందు వైరాగ్యముత్పన్నమగుచున్నది. అట్టి వానికి జీవించుటయందుగాని, భోగించుటయందుగాని కోరిక నశించిపోవుచున్నది. ఎందుకనగా ప్రాపంచికభోగములయందు పహ్యము, దోషదృష్టియేగదా వైరాగ్యము. ప్రపంచములో ఉత్పత్తివినాశములు గల ప్రతివస్తువునందు దోషముండనే యున్నది. భార్య, బిడ్డలు, ధనము, శరీరము మొదలగునవి ప్రీతి

పాత్రములై యున్నవి. వారలను సుఖపెట్టవలెననీ, తద్వారా సుఖపడవలెననీ పురుషుడు అనేకానర్థములను చేయుచున్నాడు. మరియు వీరందరు జీవునికి బంధకారణములై యున్నారు. ఇందువలన వీటియందు వైరాగ్యము కలుగకుండా పురుషుడొకప్పుడును ముక్తిని పొందజాలడు. ఈ హేతువువలన ప్రాపంచికవిషయముల యందు దోషదృష్టిని కలిగియుండుటెంతయు అవసరము. యోగవాసిష్ఠమునందుగూడ చెప్పబడినది —

"గర్భే దుర్గంధభూయిష్ఠే జఠరాగ్నిప్రదీపితే ।
దుఃఖం మయాప్తం యత్తస్మాత్కనీయః కుంభిపాకజమ్॥"

గొప్పదుర్గంధభూయిష్ఠమును, జఠరాగ్నిప్రదీప్తమునగు మాతృగర్భమునందు జీవుడుపడిన దుఃఖమునకంటె, కుంభీపాకనరకయాతన గూడ తక్కువే. ఇట్లు గర్భోపనిషత్తునందుగూడ గర్భదుఃఖము వర్ణింపబడినది. జీవుడు దుర్భరమగు గర్భదుఃఖము ననుభవించు కాలమున 'ఓ ప్రభూ! ఈసారిజన్మలో నేను తప్పక జ్ఞానసాధనలను చేయగలను' అని భగవంతుని ప్రార్థించును. కాని జన్మించిన తరువాత జీవుడు మరల సంసారభోగములయందే పడిపోవుచు, గర్భదుఃఖమును మరచిపోవుచున్నాడు. ఈ కారణమువలన మాటిమాటికి జననమరణములను పొందుచున్నాడు. శివగీతయందుగూడ మరణదుఃఖమును చూపించుచున్నాడు.

"హా కాంతే హా ధనం పుత్రాః క్రందమానః సుదారుణం।
మండూక ఇవ సర్పేణ మృత్యునా గీర్యతే నరః॥"

ప్రాణములను విడిచిపెట్టుచున్న సమయమునందు జీవుడు — 'హా ప్రియురాలా! అయ్యో! ధనమా! ఓ పుత్రులారా! నన్ను మృత్యువునుండి తప్పించుడు' అని సర్పమువాతపడిన కప్పవలె భయంకరముగా నరచుచు, మృత్యువువాత పడిపోవుచున్నాడు.

"అయఃపాశేన కాలస్య స్నేహపాశేన బంధుభిః।
ఆత్మానం కృష్యమాణస్య న ఖల్వాస్తి పరాయణమ్॥

అనగా — మరణకాలమునందు జీవుడు ఒకవంక యముని కాలపాశముచేతను, యింకొకవంక సంబంధుల స్నేహపాశములచేత లాగబడుచున్నాడు. కాని ఒకడుగూడ మృత్యువునుండి రక్షించుటకు సమర్థుడు కాజాలడు.

"యా మాతా సా పునర్భార్యా యా భార్యా జననీ హి సా।
యః పితా స పునః పుత్రో యః పుత్రస్స పునః పితా॥

పూర్వజన్మమునందు తల్లియే పుత్రప్రేమకారణమున ఉత్తర జన్మమునందు భార్యయగుచున్నది. పూర్వజన్మమునందు తండ్రియగువాడుత్తరజన్మమునందు కొడుకగుచున్నాడు. పుత్రుడే తండ్రియగుచున్నాడు.

"ఏకో యదా వ్రజతి కర్మపురస్సరోఽయం
విశ్రామవృక్షసదృశః ఖలు జీవలోకః।
సాయంసాయం వాసవృక్షం సమేతాః
ప్రాతః ప్రాతస్తేన తేన ప్రయాంతి॥

సాయంకాలమగుసరికి ఎక్కడెక్కడనుండియో యెగిరివచ్చి పక్షులు రాత్రంతయు విశ్రాంతికొరకు ఒకే వృక్షమునందు గుమిగూడుచు మరల తెల్లవారగనే ఇటూ - అటూ ఎగిరిపోవునట్లు, యీ సంసారరూపవృక్షమునందు జీవులు కర్మవశులై ఒకచోట కూడి, ప్రారబ్ధకర్మానుభవము పూర్తికాగానే, మరల యెవరికివారు వేరై పోవుచున్నారు. అంతేగాని భార్యగాని, బిడ్డలుగాని, ధనముగాని ఏదియు వచ్చినప్పుడు వెంటరాదు; పోయినప్పుడు కూడపోదు అని విచారించి వీటిపై నెప్పుడును మోహముంచకుము.

"నరస్య బంధనార్థాయ శృంఖలా స్త్రీ ప్రకీర్తితా।
లోహబద్ధోఽపి ముచ్యేత స్త్రీబద్ధో నైవ ముచ్యతే।

పురుషునకు బంధహేతువైన స్త్రీని శృంఖలమునుగా వర్ణించిరి. ఇనుపగొలుసులచేత బద్ధుడగువాడొకవేళ తప్పించుకొనినను తప్పించుకొనవచ్చుగాని, స్త్రీస్నేహరూపపాశములచే బద్ధుడగు వాడొకప్పుడును తప్పించుకొనజాలడు. ఈ విషయమై యొక దృష్టాంతమున్నది.

ఒక పిల్లవాడు బాల్యావస్థలోనే సన్న్యాసియైపోయెను. రానురాను అతనికి యౌవనావస్థకూడ ప్రాప్తించెను. ఒకదిన మాతడు తీర్థయాత్రకై పోవుచుండగా దారిలో అతని కెదురుగా కొందరు పెండ్లివారెదురైరి. ఆ సన్న్యాసి నిలువబడి యిదియేమి? అని అడిగెను. ఇది వివాహపుసన్నాహమనీ ఆ గుర్రముమీద ఉన్న కుర్రవానికి ఒక అమ్మాయితో వివాహమగునని వారు

చెప్పిరి. "అయితే అప్పుడేమగును?" అని సన్న్యాసి అడిగెను. పెండ్లి అయిన తరువాత యితనిభార్య యింటికిరాగానే యిద్దరికి విషయానందము కలుగును. తరువాత ఆమెకు పిల్లలు పుట్టుదురు అని వారుచెప్పగా విని సన్న్యాసి తనదారిని పోయెను. త్రోవలో అలసటచేత ఆ సన్న్యాసి వృక్షము క్రిందనున్న ఒక నూతిగోడపై నిద్రపోయెను. వెంటనే అతడొక కలగనెను. తనకొక స్త్రీతో పెండ్లి అయినట్లు, ఆమె తనతోగూడ ఒకే మంచముపైని పండు కొన్నట్లు, ఆమె కొంచము జరగండి అని చెప్పగా విని తాను కొంచెము వెనుకకు జరుగుటకు ప్రయత్నించుసరికి అతడానూతిలో పడిపోయెను. ఆ శబ్దము విని పరిసరప్రాంతీయులు పరుగెత్తుకొని వచ్చి, ఎవరు నిన్ను నూతిలో పడద్రోసిరని ప్రశ్నించిరి. అప్పు డతడు — అయ్యా! స్వప్నస్త్రీయే నన్ని నూతిలో పడద్రోసి నది. ఇక నిజమైనస్త్రీ పురుషుల నెట్టి దుర్దశల పాలుచేయునో యెవరు చెప్పగలరు? అని అనెను.

ప్రశ్న॥ మహాత్మా! కర్మఠులగువారు "పుత్రులు లేని వారికి గతిలేదనియు, అందువలన యేదోయొక ఉపాయముచేత సంతానమును బడయవలయునని దేవీభాగవతాది గ్రంథము లలో వ్రాయబడియున్నదనియు చెప్పుచున్నారు. ఇది నిజమా?

ఉ॥ పుత్రులులేనివారికి గతిలేదని మీరు చెప్పినదానిలో గల గతిశబ్దమున కర్థమేమి? గతిశబ్దమున కర్థము మోక్షమందువా? లేక ఉభయలోక సుఖమందువా? మోక్షమనియే చెప్పినచో

నప్పుడు పుత్రులు గలవారందరు ముక్తులు గావలయును. మరియు మనుష్యులు, పశువులు మొదలుగాగలవన్నియు జ్ఞానము లేకనే ముక్తిని పొందవలసియున్నది. అంతేగాక శుక, వామ దేవాదులకు చెప్పిన శాస్త్రములుగూడ వ్యర్థమగును. ఎందు కనగా వారు నైష్ఠికబ్రహ్మచారులు. ఇందువలన పుత్రులవల్ల గతిగలదని చెప్పిన వాక్యము అర్థవాదరూపమని చెప్పవలసి యున్నది. లోకులు పుత్రసంబంధమువలన గొప్ప దుఃఖముల ననుభవించుచున్నారు. దశరథమహారాజు శ్రీ రామచంద్రమూర్తి వియోగమువలన ప్రాణత్యాగమును చేసెను. మొదట పుత్రులు కలుగవలెననెడి చింత, తరువాత వారు జీవించవలెననీ, పిదప వారికి వివాహాదులు కావలెననీ, అటుపిమ్మట వారికి పుత్రులు కలుగవలయునని యీ విధమగు చింత జన్మాంతము ఉండును. మరియు పుత్రుడు పెద్దవాడైనపిదప తండ్రి వృద్ధా వస్థలో తండ్రి సంపాదించిన ధనాదులను యిచ్ఛానుసారము వెచ్చించుచున్నాడు. మరియు సేవాదికార్యముల నేమియు చేయడు. అందువలన పుత్రుడుగూడ వివేకవంతులకు దుఃఖ హేతువే యగుచున్నాడు. ఈవిధముగా విషయములన్నియు దుఃఖకారణములే యగుచున్నవి. వివేకచూడామణియందు చెప్ప బడినది చూడుడు:

"విషయాశా మహాపాశాత్ యో విముక్తస్సుదుస్త్యజాత్।
సఏవ కల్పతే ముక్త్యై నాన్యే షట్ఛాస్త్రవేదినః ॥

అనగా స్త్రీపుత్రధనాదిక విషయములు గొప్ప పాశములు. వాటిని త్యజించుట గొప్పకష్టము. ఆ పాశములనుండి తప్పించు కొన్నవాడే ముక్తికి అధికారి. అంతేగాని షట్‌శాస్త్రములను తెలిసినవాడైనను ఆ పాశములనుండి విడివడనిచో ముక్తికి అధి కారి కాజాలడు. అందువలననే ప్రపంచములో సంపూర్ణ విషయ వాసనలనుండి రహితుడగు విరాగి, జీవన్ముక్తుడు యేలక్షల లోనో ఒక్కడుండునని అష్టావక్రమునీంద్రుడు చెప్పెను.

శ్లో॥ అనిత్యం సర్వమేవేదం తాపత్రితయదూషితం ।
అసత్యం నిందితం హేయమితి నిశ్చిత్య శామ్యతి॥ 3

టీక॥ ఇదం = ఈ, సర్వం = సమస్తప్రపంచము, అనిత్యం = అనిత్య మైనది, తాపత్రితయదూషితం = తాపత్రయముచేత దూషితమైనది, అసత్యం = అసత్యమైనది, నిందితం = నిందితమైనది, హేయం = హేయమైనది, ఇతి = ఇట్లని, నిశ్చిత్య = నిశ్చయించి, శామ్యతి = శాంతిని పొందుచున్నాడు.

తా॥ ప్రశ్న॥ జ్ఞానికి సర్వత్ర యిచ్ఛోపశమనము గలుగు టకు కారణమేమి?

ఉ॥ దృశ్యప్రపంచము అనిత్యమని, అనగా చైతన్యము నందు అధ్యస్తమైయున్నదని తెలుసుకొనుటవలన.

ప్రశ్న॥ ఈ ప్రపంచ మెట్లున్నది?

ఉ॥ ఆధ్యాత్మికాది తాపములవలన దూషితమైయున్నది. వాతపిత్త శ్లేష్మాది నిమిత్తముగాగాని, లేక కామ క్రోధ లోభ

మోహాదులనుండిగాని కలిగిన మానసికదుఃఖమునకు ఆధ్యాత్మిక తాపమని పేరు. మనుష్య, పశు, పక్షి, సర్పాదులవలన కలిగిన దుఃఖము ఆధిభౌతికము. యక్ష, రాక్షస, పిశాచాదులవలన కలిగినతాపము ఆధిదైవికము. ఈ త్రివిధములగు దుఃఖమువలన పురుషుడు నిరంతరము సంతప్తుడగుచున్నాడు. కావున యీ సమస్తప్రపంచము సారహీనము, తుచ్ఛము, విడువదగినదిగా నున్నది అని తెలిసికొనిన జ్ఞాని యే పదార్థమునైనను ఇచ్ఛగింపడు.

అవ॥ సుఖదుఃఖాది ద్వంద్వములు ప్రారబ్ధవశమున సంభవించునవి· కావున వాని నవశ్య మనుభవించవలెను· కావున వానియందు కోరికలేక, ద్వేషమునులేక సమబుద్ధితో అనుభవించువాడు జ్ఞానియని చెప్పుచున్నాడు.

శ్లో॥ కోఽసౌ కాలో వయః కిం వా
యత్ర ద్వంద్వాని నో నృణాం ।
తాన్యుపేక్ష్య యథా ప్రాప్త-
వర్తీ సిద్ధిమవాప్నుయాత్ ॥ 4

టీక॥ యత్ర = దేనియందు, నృణాం = మనుష్యులకు, ద్వంద్వాని = సుఖదుఃఖద్వంద్వములు, నో = లేవో, అసౌ = ఈ, కాలః = కాలము, కః = ఏది?, వయః = వయస్సు, కిం = ఏది?, అపితు = అయితే, న కోఽపి = ఏమియులేదు, (ఇతి = ఇట్లని) తాని = వాటినన్నిటిని, ఉపేక్ష్య = ఉపేక్షించి, యథాప్రాప్తవర్తీ = యాదృచ్ఛికముగా వచ్చిన భోగముల ననుభవించుచూ, సిద్ధిం = సిద్ధిని, అవాప్నుయాత్ = పొందుచున్నాడు.

తా॥ పురుషుడు సుఖదుఃఖాదిద్వంద్వములను ప్రత్యేక కాలములోగాని, ప్రత్యేకావస్థలోగాని అనుభవించవలెనని యేమీలేదు. మరి అన్నికాలములలోను, అన్నిఅవస్థలలోను సుఖదుఃఖాది ద్వంద్వములను అనుభవించుచున్నాడు. ఈ విష యమై శ్రీరామచంద్రుడు అధ్యాత్మరామాయణమునందిట్లు చెప్పుచున్నాడు:

"సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం।
ద్వయమేతద్ధి జంతూనామలంఘ్యం దినరాత్రివత్ ॥"

రాత్రింబవళ్లవలె సుఖానంతరము దుఃఖము, దుఃఖానంతరము సుఖము నియతమైయున్నది. నిశ్చయముగా జీవునకీరెండును అలంఘ్యములై యున్నవి. అనగా అడ్డుకొనుటకు శక్యము గాకున్నవి.

"సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యే స్థితం సుఖం।
ద్వయమన్యోన్యసంయుక్తం ప్రోచ్యతే జలపంకవత్ ॥"

సుఖమునందు దుఃఖము, దుఃఖమునందు సుఖము — మిళితమైయున్నవి. అనగా క్షణమాత్ర సుఖమునిచ్చునట్టి విషయములవలన అనేకదుఃఖము లుత్పన్నములగుచున్నవి. ఉప వాసాదివ్రతములు మొదట కష్టమును కలుగజేసినను, తుదకు అభీష్టప్రాప్తిరూపసుఖమును కలుగజేయుచున్నవి. జలపంకముల వలె సుఖదుఃఖములు రెండును మిళితమైయున్నవి. దేహధారి యగు యెవనిచేతనైనను, ఏ కాలమునందైనను సుఖదుఃఖ

ములు త్యజింప వలనుపడవు. కాన వివేకవంతుడు సుఖదుఃఖాది ద్వంద్వములయందలి కోరికనువిడచి శరీరమును ప్రారబ్ధమునకే వదలిపెట్టుచున్నాడు.

అవ॥ ప్రతివాది జిగీషాది దోషదూషితములగు తర్కాది శాస్త్రములయందును, కర్మహేతువులగు యాగాదులయందును, ప్రాణనిరోధములగు యోగాదులయందును ముముక్షువున కాసక్తి తగదని చెప్పుచున్నాడు.

శ్లో॥ నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా।
దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః ॥

టీక॥ మహర్షీణాం = మహర్షులయొక్కయు, సాధూనాం = సాధుపురుషులయొక్కయు, తథా = అదేవిధముగ, యోగినాం = యోగులయొక్కయు, నానామతం = భిన్న భిన్నములగు మతములను, దృష్ట్వా = చూచి, నిర్వేదం = వైరాగ్యమును, ఆపన్నః = పొందినవాడై, కః మానవః = ఏ మానవుడు, న శామ్యతి = శాంతిని పొందడు?

తా॥ మహర్షులు, సాధువులు, యోగులు యీ మొదలగు మహాత్ములు ఒకరిమతము నొకరు అంగీకరించుట లేదు. మరల వీరిలోనే వీరికి భేదము గనిపించుచున్నది. అందువలన యిట్టి భిన్న భిన్న మతములనుచూచి, వాటియందు విసుగు జనించినవాడు తప్పక ఆత్మశాంతిని బొందగోరును. ఓ శిష్యా! నీవు తర్కశాస్త్రాదులను,కర్మకాండయందలి యాసక్తినివిడిచి కేవలాత్మజ్ఞాననిష్ఠనే చేయుచుండవలయును. ఎందుకనగా తర్కాదిశాస్త్రములు బుద్ధిభ్రమకారకములు. గౌతమాదుల మతము వేదమునకును

మరియు యుక్తి ప్రమాణములకును విరుద్ధమైయున్నది. కేవలము భ్రమజలములో ముంచివేయుబడిగా నున్నది. గౌతమాదుల మతానుయాయులగు నైయ్యాయికులు జీవాత్మను, ఈశ్వరాత్మను రెంటిని జడములని అభిప్రాయపడుచున్నారు. మరియు జ్ఞానము, ఇచ్ఛా మొదలగునవి ఆత్మగుణములనియును, యీశ్వరాత్మగుణములు నిత్యమనియును, జీవాత్మగుణములు అనిత్యమనియును, సమస్త జీవాత్మలు వ్యాపకములనియును, ఆత్మ సంయోగమే జ్ఞానకారణమనియును, పరమాణువులవలన జగదుత్పత్తియగుచున్నదనియును, మరల పరమాణువులు నిరవయవములనియును తలంచుచున్నారు.

ఉ॥ ప్రథమములో జీవాత్మ, పరమాత్మలు జడములు కాజాలవు. ఎందుకనగా — "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ". ఆత్మ సత్యస్వరూపము, జ్ఞానస్వరూపము, ఆనందస్వరూపమై యున్నది అను యీ శ్రుతితో విరోధమువచ్చి పడుచున్నది. రెండవది — జీవ ఈశ్వరాత్మలకు జడత్వమును భావించినచో జగదంధకార ప్రసంగము కలుగును. ఒకవేళ కర్మజడము, ఆత్మయు జడమే, ఈశ్వరాత్మయు జడమేనని తలంచినచో, అప్పుడు భోక్త గాని, కర్తగాని, ఫలప్రదాతగాని ఉండనేరదు. ఎందుకనగా జడమునందు కర్తృత్వ, భోక్తృత్వాది శక్తి లేదు. మరియు జడ సంబంధములగు గుణములు జ్ఞానమును మరియు చైతన్యమును కలుగజేయజాలవు. అగ్ని — ఉష్ణము, జలము — శీతలము

భిన్నముగానట్లు గుణికంటె గుణము భిన్నముగాదు. అగ్నినుండి ఉష్ణతను, ప్రకాశమును తీసివేసినచో అగ్ని మరియేమియు మిగిలి ఉండదు. ఉష్ణము, ప్రకాశము అగ్నికి స్వరూపములైనట్లు, జ్ఞానము — చైతన్యమే ఆత్మస్వరూపములై యున్నవి; ఆత్మధర్మములుకావు. ఎందుకనగా, గుణ — గుణీభావము ఆత్మకు కలదనీ, చైతన్యము జడధర్మమనీ యెక్కడా వ్రాయుబడి యుండలేదు. మరియు దృష్టాంతముగూడ దొరుకుటలేదు. కావున నైయాయికులకథనము అసంగతమని తెలియుచున్నది.

మరియు ఈశ్వరునకు ఇచ్ఛాదిగుణములు నిత్యములని తలంచినచో, అప్పుడు యీశ్వరుని ఇచ్ఛానుసారమే యీ జగదుత్పత్తియు, ప్రళయమును యెల్లప్పుడు అయియుండవలెను. అనగా ఆ రెండింటిలో నొకటిగాని, లేక ఆ రెండుగాని లేకుండ ఉండవలెను. అట్లుగాక రెండింటికి యెప్పుడో సృష్టి, యెప్పుడో ప్రళయము అని చెప్పినచో యీశ్వరుని యిచ్ఛయే అనిత్యము కావలసివచ్చును.

జీవాత్మ వ్యాపకుడు అనునదియు పొసగదు. ఒకవేళ జీవాత్మ సర్వవ్యాపకుడని తలంచినచో, ఒకే శరీరమునందు జగత్పూర్ణులగు జీవాత్మలు ఉంటున్నారు. మరియు అన్ని జీవాత్మలతో అతనికి మనస్సంయోగము కలుగుటవలన అతనికి సర్వజ్ఞత కలిగియుండవలెను. ఇందువలన అతనికి సమస్తమునుగూర్చిన సర్వజ్ఞత కలుగవలెను. కాని ప్రపంచమున నజ్ఞులయి కనబడుట

లేదు. దీనివలన జీవాత్మలకు వ్యాపకమును చెప్పుట యుక్తికి ప్రమాణమునకు విరుద్ధమని సిద్ధమైనది.

మరియు నిరవయవములగు పరమాణువులకు సంయోగము కలుగదనీ, సావయవములకే సంయోగము కలుగుననీ చెప్పబడి నందునను, మరియు యుక్తికి ప్రమాణమునకు సరిపడనందునను పరమాణువులనుండిగూడ జగదుత్పత్తికాజాలదు. ఈ కారణము వలన వివేకవంతులకు నైయాయికమతము విడిచిపెట్టదగినదిగా నున్నది. ఇదే విధముగ కర్మనిష్ఠాపరుల మతమునందును నానా ప్రకారములగు జగడము లుండుటవలన వివేకవంతుడు దాని యందును ఆసక్తి నిడదగదు. కర్మఠులు కొందరు హోమాదులే ముఖ్యములని తలంచుచున్నారు. మరికొందరు మంత్రోపాధు లనే ప్రధానములని తలంచుచున్నారు. ఇంకకొందరు కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములు చేయుటయే ధర్మమని అనుకొను చున్నారు. కొందరు మూర్తి పూజలను, కొందరు యజ్ఞాదుల యందు పశువధలను, కొందరు తీర్థాటనములను ప్రధానములనుగా తలంచుచున్నారు. ఇట్లు యీ కర్మజాలము — ఒక మనుష్యుడు దినమున కొక కర్మచొప్పున తన జీవితమంతయు చేసినను సమాప్తము కానంతటి గొప్పదై యున్నది. మరియు ఘటీయంత్రము వలె క్రిందికి మీదికి త్రిప్పుటకు — అనగా స్వర్గ-నరకములకు హేతువైన కర్మరూప జాలమై (వలయై) యున్నది.

ఈ విషయమై శాస్త్రమిట్లు చెప్పుచున్నది.

"కర్మణా బధ్యతే జంతుర్విద్యయా చ విముచ్యతే।
తస్మాత్కర్మ న కుర్వన్తి యత్తయః పారదర్శినః ॥ "

జీవుడు కర్మవలన బంధమును, ఆత్మవిద్యవలన మోక్షమును పొందుచున్నాడు. ఇందువలన వివేకియగు ఆత్మజ్ఞాని కర్మరుడు గానొల్లడు. మరేమన ఆత్మనిష్ఠయందే మగ్నుడగుచున్నాడు.

జైమిన్యాచార్యులయొక్క మతముకూడ శ్రుతివిరుద్ధమై యున్నది. ఎందుకనగా జైమిని ఆత్మ జడ - చేతన - ఉభయ రూపమని తలంచుచున్నాడు. మరియు స్వర్గప్రాప్తినే మోక్ష మని తలంచుచున్నాడు.

ఒకే పదార్థము జడ చేతనోభయాత్మకమై యుండ జాలదు. ఎందుకనగా యీ విషయమై ప్రమాణమేమియు కన బడుటలేదు. మరియు చేతనము నిరవయవము, జడము సావ యవమును అనిత్యమునై యున్నది. శీతోష్ణము లెట్లు పరస్పర విరుద్ధములో అట్లే జడచైతన్యములుకూడ విరుద్ధములు. మరియు ఆత్మ ఉభయరూపాత్మకమైనదనియు, స్వర్గమే మోక్షమనియు వేదమునందు యెక్కడకూడ వ్రాయబడియుండలేదు.

"తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవాముత్ర
పుణ్యచితో లోకః క్షీయతే ॥ "

ఈ ప్రపంచములో కర్మరులవలన పొందబడిన ఫలము నరకాదు లను గలిగించి మరల యెట్లు నశించుచున్నదో, అట్లే పుణ్యకర్మల

వలన గలిగిన ఫలము స్వర్గమునుపొందించి మరల క్షీణమగుచున్నది అని శ్రుతి చెప్పుచున్నది. ఈ శ్రుతివాక్యమువలన కర్మఫలము యొక్క అనిత్యత సిద్ధమైనది. ఎప్పుడు స్వర్గము అనిత్యమో, అప్పుడు మోక్షముకూడ అనిత్యము కావలసివచ్చును. దాని వలన జైమినిమతమును ఆత్మజ్ఞాననిష్ఠగలవారు త్యజించవలసి యున్నది.

అవ॥ కర్మాదుల నుపేక్షించి కేవలజ్ఞాననిష్ఠచే ముక్తుడగునని చెప్పుచున్నాడు.

శ్లో॥ కృత్వా మూర్తిపరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః।
నిర్వేదసమతాయుక్త్యా యస్తారయతి సంసృతేః॥

టీక॥ నిర్వేదసమతాయుక్త్యా - నిర్వేద = వైరాగ్యము, సమతా = సమత్వము, యుక్త్యా = యుక్తులచేత, చైతన్యస్య = చైతన్యస్వరూపుడైన ఆత్మయొక్క, మూర్తి పరిజ్ఞానం = ఆకారవిశేషజ్ఞానమును, కృత్వా = చేసి, యః = ఎవడు, సంసృతేః = సంసారమునుండి, స్వం = తనను, తారయతి = తరింపజేసికొనుచున్నాడో, సః = అట్టివాడు, గురుః = గురువు, న కిం = కాడాయేమి? (అగుచున్నాడని భావము.)

తా॥ ఓ జనకుడా! ఎవడు విషయవాసనలను త్యజించి శత్రువునందును, మిత్రునియందును సమబుద్ధిగలిగి శ్రుతిస్మృతుల యుక్తులవలన సచ్చిదానందరూపమగు తన ఆత్మసాక్షాత్కారమును చేసికొనుచున్నాడో, ఎవడు తనను సర్వభూతస్వరూపునిగా అనుభవపూర్వకముగ తెలిసికొనుచున్నాడో, అతడు సంసారము

నుండి తనను తరింపజేసికొనుచున్నాడు. తదితరుడు తరింపజాలడు. ఓ జనకా! నీవు నీ పురుషప్రయత్నమువలననే ముక్తుడవు కావలయును. ఇతరునివలన కాజాలవు.

ప్రశ్న॥ గురుదేవా! ప్రపంచములో కొందరు "గురువే శిష్యుని ముక్తునిగా చేయుచున్నాడు" అని చెప్పుచున్నారు. ఇప్పుడు తమరు దానికి విరుద్ధముగా శిష్యుడు తనకుతానే స్వప్రయత్నమువలన ముక్తుడు కావలయునని చెప్పుచున్నారు. ఇది నాకర్థమగుట లేదు.

ఉ॥ శాస్త్రతాత్పర్యమును గురు, శిష్య శబ్దార్థములను తెలియనివారే తరుచుగా నిట్లు చెప్పుదురు. ఎందుకనగా వారు కామనాబుద్ధిగలవారు. ముసల్మానులెట్లు పైగంబరులు (యీశ్వరసందేశహారులు) మనలను పాపములనుండి విముక్తులనుగా చేయుచున్నారని తలంచుచున్నారో, క్రైస్తవులు యేసుప్రభువే మనలను పాపములనుండి విముక్తిని పొందించుచున్నాడని నమ్ముచున్నారో, అట్లే సంసారిజనులు గురువే మనలను పాపముల నుండి తప్పించి మోక్షమును కలుగజేయుచున్నాడని తలంచుచున్నారు. ఈ విధముగా వారితలంపు ఒకవిధముగా ఉత్తమమైనదే. ఎందుకనగా వేదమునందును, శాస్త్రమునందును యీ రహస్యము మంత్రములద్వారా గురువు అవసరమని చెప్పబడియున్నది. ఎవడు అజ్ఞానమునుండి, అజ్ఞానకార్యమగు జననమరణరూప సంసారమునుండి ఆత్మజ్ఞానోపదేశముద్వారా విముక్తు

లను చేయుచున్నాడో, మరియు మనస్సునందలి సకలసందేహ ములను నివృత్తిచేయుచున్నాడో, అతడే గురువు. అయితే గురూపదిష్టమార్గము ననుసరింపజాలని శిష్యులు ఉత్తమగతిని పొందజాలనిచో లోప మెవరిది? అది శిష్యులదేగాని గురు దేవునిది కాజాలదు. రామచంద్రమూర్తి వసిష్ఠమునీంద్రుని పెక్కుసందేహములనుగూర్చి ప్రశ్నించెను. వసిష్ఠమునీంద్రుడన్ని ఆశంకలకును సమాధానమునొసంగి, సందేహనివృత్తి నొనరించి రామచంద్రునకాత్మప్రబోధమును జేసెను. అప్పుడాతడు వసిష్ఠ మునీంద్రుని గురువుగా భావించెను. అర్జునుడు శ్రీకృష్ణభగ వానునిగూర్చి వేలకొలది శంకలనుచేసెను. భగవానుడు ఆశంకల కన్నింటికి సమాధానమును చెప్పి, విశ్వరూపమును చూపించి నప్పుడు అర్జునుడు కృష్ణభగవానుని గురువుగా తలంచెను. ఈ విధముగా పూర్వమునందున్న శ్రేష్ఠపురుషులు చిత్తసందేహ మును దూరమొనరించువారినే గురువులుగా భావించుచుండిరి. అదిగూడ వ్యవహారదృష్టితోనేగాని, ఆత్మదృష్టితో నట్లు తలం చుటలేదు. ఎందుకనగా ఆత్మదృష్టియందు ఆత్మకు భేదమే లేదుగదా! ఆత్మజ్ఞానియే పరమార్థగురువై యున్నాడు. అటు వంటి గురువులు ప్రపంచములో చాల తక్కువ.

శ్లో॥ పశ్య భూతవికారాం స్త్వం భూతమాత్రాన్ యథార్థతః।
తత్క్షణాద్బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి॥ 7

టీక॥ భూతవికారాన్ = భూతవికారములైన దేహేంద్రియాదులను,యథార్థతః = వాస్తవముగా, భూతమాత్రాన్ = భూతమాత్రములనుగా, త్వం = నీవు, పశ్య = చూతువుగాక!, తత్క్షణాత్ = అట్లు చూచినవెంటనే, బంధనిర్ముక్తః = బంధమునుండి విడివడినవాడవై, స్వరూపస్థః = స్వరూపస్థితియందున్నవాడవుగా, భవిష్యసి = కాగలవు.

తా॥ ఓ జనకా! భూతవికారములగు దేహేంద్రియాదులను వాటి యథార్థరూపములగు భూతములుగానే చూడుము. అనగా అవి పంచభూతములకంటె భిన్నములుగావని తెలిసికొనుము. ఈ విధముగా నీవు చూడగలిగిన తత్క్షణమే, దేహాదులకంటె వేఱైనవాడవై ఆత్మస్వరూపమునందు స్థితుడవుకాగలవు. మరియు వాటికి సాక్షిభూతమగు ఆత్మకూడ నీకు కరతలామలకమువలె ప్రత్యక్షము కాగలదు.

శ్లో॥ వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచ తాః ।
తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్య యథా తథా ॥ 8

టీక॥ వాసనా ఏవ = వాసనలే, సంసారః = సంసారము, ఇతి = ఇట్లని, జ్ఞాత్వా = తెలిసికొని, తాః సర్వాః = ఆ వాసనలనన్నింటినీ, విముంచ = విడువుము, వాసనాత్యాగాత్ = వాసనాత్యాగమువలన, తత్త్యాగః = ఆ సంసారత్యాగముగూడ అగుచున్నది, అద్య = ఇట్లయిన పిదప, యథా = ప్రారబ్ధమెట్లున్నదో, తథా = తదనుసారమే, స్థితిః = శరీరస్థితియగుచున్నది.

ప్రశ్న॥ పూర్వోక్తయుక్తిచేత పురుషుడు ఆత్మను తెలిసికొన్నను దానియందు నిష్ఠ కలుగుటెట్లు ?

ఉ॥ అనేక విషయవాసనలే సంసారము. అనగా అదే బంధము. యోగవాసిష్ఠమునందు యీ విషయము చెప్పబడినది.

"లోకవాసనయా జంతోః శాస్త్రవాసనయాఽపి చ।
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే॥"

వాసనలు మూడు విధములు. (1) లోకవాసన — అనగా స్వర్గాది ఉత్తమలోకప్రాప్తి నాకు కావలయును అనునదే లోకవాసన. (2) శాస్త్రములను చదివి — నాతో సమానుడగు పండితుడింకొకడు లేనిస్థితిని పొందుదును అనునదే శాస్త్రవాసన. (3) నా శరీర మందరి శరీరములకంటె సుందరమైనది. దీని నెల్లప్పుడు తగ్గకుండ నేను పరిపోషింతును అనునదే దేహవాసన. ఈ మూడువాసనలను విడిచిపెట్టినప్పుడే పురుషుడు బంధనమునుండి విముక్తుడగుచున్నాడు. అప్పుడే అతని చిత్తము ఆత్మయందు నిలకడగలిగి యుంటున్నది.

ప్రశ్న॥ సమస్తవాసనలను విడిచిపెట్టినచో శరీరమెట్లుండును? అనగా శరీరము యెట్లు నిలుచును?

ఉ॥ పాలు త్రాగుచున్న బాలునియొక్కయు, ఉన్మత్తుడు అనగా పిచ్చివానియొక్కయు శరీరస్థితి ప్రారబ్ధకర్మవశమున యెట్లు గడచిపోవుచున్నదో, అదేవిధముగ వాసనారహితుడగు జ్ఞానియొక్క శరీరస్థితియు ప్రారబ్ధవశమువల్లనే ఉంటున్నది.

అయితే యీ వాసన అనగా శరీరమెట్లు సిద్ధించినదో (వచ్చినదో) అదేవిధమున దానిని విడుచుటగూడ ఉచితమైనదే.

ప్రశ్న॥ ఒకవేళ పురుషుడు అన్నివిషయవాసనలను త్యజించినట్లయినచో అప్పుడు ఆత్మజ్ఞానమునుగూడ అతడు పొందజాలడు. ఎందుకనగా ముముక్షువులు ఆత్మజ్ఞానమును పొందుటకు గూడ వాసన యెల్లప్పుడు ఉండియే తీరవలెను. మరియు జ్ఞానులకుగూడ చిత్తనిరోధము వాసనలనుండియే కలుగుచున్నది. ఇంకను జీవన్ముక్తుడగుటకుగూడ యీ వాసనయే ముఖ్య సాధనమైయున్నది. సమస్తవాసనలను త్యజించుట యెవనికిని శక్యము కాజాలదు.

ఉ॥ వాల్మీకిరామాయణమునందిట్లు లిఖింపబడియున్నది.

"వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।
మలినా జన్మహేతుస్స్యాచ్ఛుద్ధా జన్మవినాశినీ ॥

శుద్ధవాసనయనియు, మలినవాసనయనియు వాసన రెండు విధములుగా చెప్పబడినది. "నేనెట్లు ముక్తిని పొందగలను? ఆత్మసాక్షాత్కార మెట్లు కలుగును?" అని అందుకొరకు ఆ వృత్తులను నిరోధించుటయే శుభవాసన. విషయభోగముల ననుభవించవలయునని తలంచుటయే మలినవాసన. ఈ రెండింటిలో మలినవాసన జన్మహేతువును, శుద్ధవాసన జన్మనాశకము నగుచున్నవి. చతుర్థ (నాల్గవ) భూమికలో నున్నటువంటివానికిని, ముముక్షు

వునకును శుద్ధవాసనలను త్యజింపవలసిన పనిలేదు. అశుభ వాస
నలను త్యజింపవలసియున్నది. ఎందుకనగా విదేహాముక్తియందు
ఆత్మజ్ఞానమే ప్రధానమైయున్నది. శుభ వాసనలయొక్క నాశ
మక్కడ ఉపయోగము కాదు. అయితే జీవన్ముక్తికొరకు సమగ్ర
వాసనాత్యాగము, మనోనాశము, ఆత్మజ్ఞానము యీ మూడును
ఉపయుక్తములై యున్నవి.

ఇది తొమ్మిదవ ప్రకరణము



ఓమ్

# అష్టావక్రగీత

## పదవప్రకరణము

### ఉపశమాష్టకము



అవ॥ ముందు ప్రకరణములందు విషయసంబంధములేని సంతోషరూప వైరాగ్యము చెప్పబడినది. ఇప్పుడీ ప్రకరణమునందు తృష్ణాత్యాగనిరూపణము చేయబడుచున్నది.

శ్లో॥ విహాయ వైరిణం కామమర్థం చానర్థసంకులం ।
ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరం కురు ॥ 1

టీక॥ వైరిణం = శత్రురూపమగు, కామం = కామమునున్ను, చ = మరియు, అనర్థసంకులం = అనర్థములతో నిండిన, అర్థం = అర్థమునున్ను, విహాయ = విడిచిపెట్టి, ఏతయోః = ఈ రెండింటికి, హేతుం = కారణమైన, ధర్మమపి = ధర్మమునున్ను, విహాయ = విడిచిపెట్టి, సర్వత్ర ధర్మార్థకామములయందును, వాటికి నిమిత్తములగు కర్మములయందును, అనాదరం = అనాదరమును, కురు = చేయుము.

తా॥ ఓ జనకా ! కామమే శత్రువు. ఈ కామమే సంపూర్ణానర్థములకు మూలమును దుర్జయమునై యున్నది. దీనినిగూర్చి ఆత్మపురాణమునందిట్లు చెప్పబడినది.

"కామేన విజితో బ్రహ్మా కామేన విజితో హరః ।
కామేన విజితో విష్ణుః శక్రః కామేన నిర్జితః ॥"

కామదేవుడు బ్రహ్మను జయించెను. విష్ణువును, యీశ్వరుని, యింద్రునికూడ జయించెను. కావుననే సర్వానర్థములకు మూలమని చెప్పబడెను. ధనము నార్జించుటయందును, రక్షించుటయందును,నాశమునందును గల దుఃఖమునకు మూలము కామమే. మరియు నో జనకమహారాజా! కామమునకు కారణమగు ధర్మమును, సకామకర్మములను త్యజింపుము. ఎందుకనగా అవి జీవన్ముక్తికి ప్రతిబంధములుగా నున్నవి.

అవ॥ అనేక ప్రకారములగు సుఖములకు కారణభూతులగు మిత్ర - పుత్ర - కళత్రాదులయందెట్లు ఉపేక్ష చేయనగునను శంకకు సమాధానము చెప్పుచున్నాడు.

శ్లో॥ స్వప్నేంద్రజాలవత్పశ్య దినాని త్రీణి పంచ వా ।
మిత్రక్షేత్రధనాగారదారదాయాదిసంపదః ॥ 2

టీక॥ మిత్రక్షేత్రధనాగారదారదాయాదిసంపదః = మిత్రులు, క్షేత్రములు, ధనములు, భవనములు, స్త్రీలు, సోదరులు మొదలగు సంపదలన్నియు, స్వప్నేంద్రజాలవత్ = స్వప్నమువంటివనియు, ఇంద్రజాలమువంటివనియు, త్రీణి = మూడుగాని, వా = లేక, పంచ = ఐదుగాని, దినాని = దినములవరకే ఉండునవనియు, పశ్య = చూడుము.

తా॥ ఓ శిష్యా! స్త్రీ, ధన, మిత్ర, పుత్ర, క్షేత్రాది భోగసాధనములన్నియు స్వప్నము లేక యింద్రజాలము వంటివని

